### ప్రకటన

కర్నూలులోని ప్రభుత్వమువారి స్వంత మోటారుబండ్లు రిపేర్లు చేయుటకు, క్రమమైన స్థితిలో వుంచుటకు ఒక తాత్కాలిక మెకానిక్ ఫోర్ మెన్ ఉద్యోగము నకు ఆంధ్ర ప్రభుత్వపు, హోమ్ డిపార్టుమెంటు వారిచే, దరఖాస్తులు కోరబడుచున్నవి. L. A. E. డిగ్రీ కలిగి, లోగడ అనుభవము గల అభ్యర్థులకు ప్రత్యేకత చూపబడును. జీతముస్కేలు రు. 70-5-100. సెలెక్టు అయిన అభ్యర్థియొక్క అనుభవము, అర్హతలనుబట్టి ప్రారంభ వేతనము హెచ్చింపబడును. ఈ ప్రకటన తేదీ లగాయతు ఒకవారములోగా, అసిస్టెంటు సెక్రటరీ, ఆంధ్రప్రభుత్వపు హోమ్ డిపార్టుమెంటు, కర్నూలువారికి దరఖాస్తులు చేరవలెను. సెలెక్టు కాబడిన అభ్యర్థి కర్నూలులో వెంటనే స్వంత ఖర్చులతో ఉద్యోగములో ప్రవేశించ సిద్ధముగా నుండవలెను.

అసిస్టెంటు సెక్రటరి, ఆంధ్రప్రభుత్వం, హోండిపార్టుమెంటు కర్నూలు.

### రాయదుర్గం

ధర్మవరం, డిప్యూటీకలెక్టరు శ్రీ అప్పయ్య నాయుడుగారు కలుగోడు గ్రామరెడ్డి, తప్పారెడ్డిగారికి సిక్ సెన్సుపతకం బహూకరించారు. రాయదుర్గం తాలూకా కలుగోడు రెడ్డిగారికి కశేపురి కరణంగారికి మద్రాసు ప్రభుత్వం సిక్ సెన్ పతకాలు ఇచ్చారు.

### ఉయ్యూరు

గన్నవరం తాలూకా ప్రజాసోషలిస్టుపార్టీ మహాసభ నవంబరు 21 న వుయ్యూరులో జరిగెను. మధ్యాహ్నం స్థానిక సినిమాహాలులో తాలూకాపార్టీ కార్యకర్తల సమావేశం శ్రీ తాతినేని బుచ్చి సుందరరావుగారి అధ్యక్షతన జరిగెను. ఆంధ్రప్రజా సోషలిస్టుపార్టీ కార్యదర్శి శ్రీ పి. వి. జి. రాజు (విజయనగరం రాజా) శ్రీ కొద్ది రెడ్డి సూర్యనారాయణ (యం. పి.) శ్రీ పాతూరి వెంకటేశ్వరరావు, శ్రీ అయినంపూడి చక్రధర్ గార్లు కూడా సమావేశానికి విజయవాడనుండి వచ్చారు. స్థానిక సోషలిస్టులు శ్రీ రాజుగారికి ఘన స్వాగతమిచ్చారు. రాత్రి శ్రీ తాతినేని బుచ్చిసుందరరావుగారిఅధ్యక్షతన గొప్ప బహిరంగసభ జరిగెను. జిల్లా పార్టీ కార్యదర్శి శ్రీ పాతూరి వెంకటేశ్వరరావు, శ్రీ కొండశంజిల్లా పార్టీకార్యదర్శి శ్రీ సీతంరాజు సాంబశివరావు, రాష్ట్ర కార్యవర్గసభ్యులు బి. రామారావుగార్లు ఉపన్యసించారు. సభానంతరం వైజ్ఞానిక ప్రదర్శనాలు జరిగాయి. శ్రీ మన్నె శివరావుగారి అభివందనాలతో సభ జయప్రదమయ్యెను.

### గుడివాడ

నవంబరు 30 వ తేదీన మండవల్లి గ్రామములో హరిజన దినోత్సవము కృష్ణాజిల్లా పంచాయితీ అధికారియైన శ్రీ కె. చంద్రయ్యగారి అధ్యక్షతన జరుపబడినది. కయికలూరు తహశీల్దారు అయిన శ్రీ యమ్. సంజీవరావుగారు, గ్రామములోని పెద్దలు గాంధి స్మారక హరిజ హాస్టలు, గాంధి సేవాశ్రమాల యొక్క మేనేజర్లు సభలో పాల్గొన్నారు. అధ్యక్షులు తమ ఉపన్యాసములో హరిజన దినోత్సవము ప్రాముఖ్యత గురించియు, హరిజనులు పరిశుభ్రముగా ఉండవలసిన ఆవశ్యకతను గురించియు విశదీకరించారు. బీద హరిజన బాల బాలికలకు అధ్యక్షులు చొక్కాలు, గౌనులు పంచిపెట్టారు.

### మాచర్ల

ఆంధ్ర ట్యుటోరియల్ అధ్యాపక సంఘ సాధారణ సమావేశం యిటీవల జరిగెను. యల్. చిరంజీవులుగారు అధ్యక్షత వహించారు. మాధ్యమిక విద్యాకమిషన్ సిఫార్సులను విమర్శించారు. వచ్చే ట్యుటోరియల్ మహాసభ గుంటూరులో జరుపుటకు నిర్ణయించారు. పిదప దిగువనూతన కార్యవర్గం ఎన్నుకున్నారు. అధ్యక్షులు కుమ్మడిదల వెంకటసుబ్బారావుగారు, ఉపాధ్యక్షులు: ఎల్. చిరంజీవిరావు, ప్రధాన కార్యదర్శి: కృష్ణమూర్తి శాస్త్రి, సంయుక్త కార్యదర్శి: చతుర్వేదుల మల్లికార్జునరావు, సభ్యులు: నందివాడ మధుసూదనరావు, యన్. సత్యనారాయణమూర్తి, కె. బైరాగి [illegible]

# రాష్ట్ర వార్తలు

### తిరుపతి

కేంద్ర ప్రభుత్వ ఆదేశానుసారంగా నెల్లూరు పోస్టల్ సూపరింటెండెంటు వుత్తరువులననుసరించి తిరుపతి తాలూకాలోని చిన్నాపు, సెట్టిపల్లి, కొత్తూరువెంకటాపురం గ్రామములలో గత నవంబరు నెల 28 తేదీనాడు బ్రాంచి పోస్టాఫీసులను స్థాపించారు. తిరుపతి డివిజన్ పోస్టల్ ఇన్స్పెక్టరువారు ఈ క్రొత్త పోస్టాఫీసుల కార్యక్రమ ప్రారంభోత్సవం జరిపించారు.

### జగ్గన్నపేట

శ్రీ వీరభద్రస్వామి వారి ఆలయంలో బిళ్ళ ఉమామహేశ్వరరావుగారి అధ్యక్షత న నవంబరు 27 న చేనేత పారిశ్రామికులసభ జరిగినది. గుంటు బ్రహ్మానందంగారు చేనేత పారిశ్రామికుల కష్టాలు వివరించారు.

మరునాడు 200 మంది చేనేత పారిశ్రామికులు ఫిర్కా చేనేత కాంగ్రెసు అధ్వర్యాన ఆర్గనైజు చేసిన వీరభద్రంగారి నాయకత్వాన హన్మకొండకు వెళ్లి రాజోలు తహశీలుదారుగారికి ఒక వినతిపత్రం సమర్పించారు.

### గుండ్లపల్లి

గ్రామసేవా సంఘ అధ్వర్యాన హరిజనదినోత్సవం సోమేశ్వర గ్రంథాలయ ప్రారంభోత్సవం జరుపబడినది. ఉదయం పతాకవందనం పిదప గ్రామీణ సంక్షేమ వుద్యోగి బి. రామకృష్ణారెడ్డిగారు 50 మంది హరిజనులు, సిబ్బంది, కలసిరాగా 50 గజాల మట్టి రోడ్డు నిర్మించారు. ఒక పెద్ద గండి పూడ్చారు. సాయంత్రంసభ జరిగింది. శ్రీ రెడ్డిగారు గ్రామోద్ధరణ గురించి వుపన్యసించారు.

### ముంగండ

హిందీ ప్రేమీమండలి వార్షికోత్సవం సుసర్ల సూర్యనారాయణమూర్తిగారి అధ్యక్షతన గతనెల 29 న జరుపబడెను. హైస్కూల్లలో ఒకటవఫారంనుంచి స్కూల్ ఫైనలువరకు నిర్బంధపరీక్షా విషయంగా చేయాలనీ, ఫారానికి 2 నుంచి 5 పిరియడ్లువరకు హిందీకి కేటాయించాలనీ, బోర్డు ప్రాథమికోన్నత పాఠశాలల్లో 6, 7, 8, తరగతుల్లో హిందీపాఠ్య విషయంగా నిర్ణయించాలనీ కోరుతూ తీర్మానాలు చేశారు.

### తెనాలి

సంగంజాగర్లమూడిలో శ్రీ సర్వజన విద్యాప్రదాయినీ పుస్తకభాండాగార యాజమాన్యమున నాటికా ప్రదర్శన పోటీలలో తెనాలి శ్రీ వెంకటగౌరీ శంకర నాట్యమండలి (ఎమెచ్యూర్సు) వారు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారిచే రచింపబడిన "ఏకాకి ప్రాయం" నాటికను ప్రదర్శించారు. ఆ నాటికలో రైతు (వెంకటాద్రి) పాత్ర నిర్వహించిన శ్రీ వేమూరి సత్యనారాయణగారిని ఉత్తమనటునిగా ఎన్నుకొని ప్రథమబహుమతిగా ఒక వెండికప్పును బహూకరించారు.

యస్. వి. జి. యస్. నాట్యమండలి కార్యదర్శి శ్రీ తూములూరు శ్రీరామమూర్తిగారు శ్రీ సత్యనారాయణగారిని అభినందించారు.

### యానాం

దీనపోషక సమాజం 28 వ వార్షికోత్సవం యిటీవల శ్రీ సాలాజార్తిగారి అధ్యక్షతన జరుపబడెను. ప్రార్థనానంతరం కార్యదర్శి కొంకె సెరుళ్లుగారు నివేదిక చదివారు. గొల్లాశ్రీనివాసరావుగారు తాము రచించిన నవరత్నాలు సమాజానికి సమర్పించారు. గిరి లక్ష్మీనారాయణ, మద్దాల సరోజినీదేవి, ఉసులు సాంబశివరావు, దుగ్గిమూర్తి మూరయ్య, బన్నా సుబ్బారాయుడుగార్లు ప్రసంగించారు. చక్రవర్తుల సుబ్బరాయశాస్త్రిగారు తమ పంచరత్నాలు చదివారు. అధ్యక్షోపన్యాసం పిదప అల్పాహారవిందుతో సభ ముగిసెను.

### అత్రేయపురము

మహాత్మాగాంధి హైస్కూలువారు శ్రీ చెరుకుపల్లి జమదగ్ని శర్మగారి అధ్యక్షతను నన్నయజయంతి జరుపుకొన్నారు. కొందరు ఉపాధ్యాయులు, విద్యార్థులు తాము రచించిన పద్యములను చదివారు. నన్నయ పద్యములు కంఠస్థముచేసి పోటీలో గెలుపొందిన విద్యార్థులకు బహుమతులీయబడినవి. జమదగ్ని గారు నన్నయ రచనలోని కథా ప్రసన్నతను, అక్షర రమ్యతను, పాత్రల యౌచిత్య ప్రశంసను చెప్పుచు, అక్కడక్కడ పద్యములను చదివి, సభికుల నానంద పరచారు. పిదప రాఘవాచార్యులవారి వందన సమర్పణముతో సభ ముగిసినది.

### గాన్గేయపురం

కమ్యూనిస్టుపార్టీ అధ్వర్యాన బహిరంగసభ జరిగింది. పి. సి. మద్దు లేటి రెడ్డిగారు అధ్యక్షత వహించారు. రాజమాన్య రాయుడు, టి. నరసింహయ్యగారు వుపన్యసిస్తూ రాజధాని సమస్యపై నాయకుల వైఖరిని ఖండించారు. పిదప రాయలసీమ అభివృద్ధికై రాష్ట్ర ప్రభుత్వం ప్రథమ ప్రాముఖ్యత యివ్వాలనీ, తుంగభద్ర ఎగువకాల్వ, గండికోట ప్రాజెక్టుల నిర్మాణం కె. సి. కెనాలు విస్తృతం చేయడం జరగాలనీ, సిద్ధేశ్వరం, నందికొండ ప్రాజెక్టులను పంచవర్ష ప్రణాళికలో చేర్చాలనీ కోరుతూ మరికొన్ని తీర్మానాలుకూడ చేశారు.

### మాచర్ల

మాచర్లలో శ్రీ కొప్పర్తి పాటి రాజరాజారావు గారు శ్రీ సత్యనారాయణ రైసుమిల్లు ప్రారంభోత్సవసందర్భములో సత్యనారాయణ వ్రతమహోత్సవము జరిపి 300 మంది అతిథులకు విందు చేశారు. తిరుపతి 3500 మంది బీదలకు అన్నదానము చేసినారు. రాత్రి శ్రీ తాతారావుగారిచే హరికథా కాలక్షేపము, మాడెర్న అప్పారావుగారిచే జాతీయగీతములు పాడబడెను.

### కొండముది

జిల్లాబోర్డు వారి ప్రాథమిక పాఠశాలకు గ్రామ పంచాయతీ అధ్యక్షాన నిడుబ్రోలు సి. బి. యన్. కళాశాల ప్రిన్సిపాలు వి. గోపాలంగారు ప్రారంభోత్సవం జరిపారు. గాంధిజీ చిత్రపటంతో, బ్యాండు మేళముతో వూరేగింపు జరిగినది. పిల్లలకు పలకలు, పుస్తకాలు పంచి పెట్టారు. పిదప యం. సత్యనారాయణ రావుగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగెను. గోపాలంగారు సభను ప్రారంభించారు. కొండముది లక్ష్మీ వెంకట హనుమంతరావు, తోటచెన్నకేశవయ్య, తోట వెంకట నారాయణరావుగార్లు ప్రసంగించారు.

### చింతపద్రు

వర్నాపురంతాలూకా వెనుకబడిన జాతుల మహాజనసభ యిచట బత్తిన రంగనాయకులుగారి అధ్యక్షతన యిటీవలజరిగెను, సిద్ధాని కోటేశ్వరరావుగారు ప్రారంభోపన్యాసం చేశారు. కొబ్బరి, తాడి, యీత చెట్లనుండి కల్లు వుచితంగాతీసి విక్రయించుకొనుటకు అవకాశం యిప్పించాలనీ, వెనుకబడినజాతుల వారికి అన్నిరంగాల్లోను తగు ప్రాతినిధ్యం యిప్పించాలనీ కోరుతూ తీర్మానాలు చేశారు. నిచ్చెనకోల శ్రీ రామమూర్తిగారి వందనములతో సభ ముగిసింది.

### గుంటూరు

శుక్రవారం ఆంధ్ర సంసత్ శాఖ 'బాలవిహార్' నెలసరి సమావేశము జిల్లా విద్యాశాఖాధికారి కార్యదర్శి శ్రీ వరిగె వెంకటరమణ రావుగారి అధ్యక్షతన 'బ్రాడీపేట ఓంకార క్షేత్రమున కడువైభవంగా జరిగినది. శ్రీ హరనాథ విద్యాలయ బాల బాలికలు అందు ప్రధానపాత్ర వహించి నృత్యగాన నాటకవినోద ప్రదర్శనలు గావించారు. శ్రీ పి. వి. సుబ్బయ్య పిల్లలకు చక్కని తర్ఫీదునిచ్చి కార్యక్రమము జయప్రదముగ నెరవేరుటకు తోడ్పడినారు. అధ్యక్షులు శ్రీ రమణారావుగారు 'బాలవిహార్' కార్యక్రమ పుటావశ్యకతను వివరించి బాల బాలికలందరు ఉత్సాహంతో ప్రతినెల జరిగే కార్యక్రమాల్లో పాల్గొనవలెనని బోధించారు. వారణాసి రామమూర్తిగారు సభను జయప్రదం గావించిన వారందరకు ధన్యవాదములు అర్పించారు.

'ఆంధ్ర సంసత్' సాధారణ సమావేశము నవంబరు 28 శనివారం సాయంత్రం శ్రీ సాలపత్తి రామమూర్తిగారి ఆవరణలో జరిగినది. శ్రీ చొప్పల్లి సూర్యనారాయణ అవధానులుగారి వేదఘన పాఠానంతరం "ఋతువర్ణనలు-పోతన" అనే విషయం గురించి వారణాసి రామమూర్తిగారు ఆంధ్ర భాగవతమునుండి ఉదాహరణల నిచ్చుచు ఉపన్యసించారు. తర్వాత శ్రీ రామపూజామందిరంవారు రామభజన గావించారు. శ్రీయుతులు చీరాల బాలకృష్ణమూర్తిగారు కొత్తూరు రామయ్య శ్రేష్ఠిగారి మిత్రులు భజనలో పాల్గొన్నారు. శ్రీ చుండూరు సత్యనారాయణగారు హార్మోనియం వాయించారు.

శ్రీ జ్యోత్స్న సమితివారు చిన్నము హనుమయ్య చౌదరిగారిని శ్రీ గొల్లమూడి సుబ్బారావుగారి అధ్యక్షతన సన్మానించారు. వెంపటి బాలకోటేశ్వరరావుగారు ప్రసంగిస్తూ, శ్రీ చౌదరిగారు గొప్పకవులనీ, సాంధ్యశ్రీ, రత్నపీఠిక, వీరపల్నాడు, మున్నగు గ్రంథాలు రచించారనీ సభికులకు తెలియజేశారు. కోడాలి వెంకటరత్నం చౌదరిగారు ప్రసంగించారు. కవిగారికి సమితివారు 116 రూ. లు, ఖద్దరు శాలువ చందన తాంబూలాదులు సమర్పించి సత్కరించారు.

గురజాడ అప్పారాయకవి వర్ధంతి సభ 2 వ తేదీ సాయంత్రం "సుందిరుసు" పత్రికా సంపాదకులు శ్రీ అంబటి సుబ్బారాయగుప్త (మద్రాసు) గారి అధ్యక్షతన "గుంటూరుపత్రికా" కార్యాలయంలో జరిగినది. "చైతన్య" గారి సరస్వతీ ప్రార్థనతో కార్యక్రమమును ప్రారంభించారు. శ్రీయుతులు కేసరపల్లి మస్తాన్ రావు, త్రిపురనేని [illegible], కోరళ్ళ వెంకటేశ్వరరావుగార్లు గురజాడ అప్పారావుగారి భాషా సేవను, సంఘ సంస్కరణను కొనియాడి, ఆంధ్ర రాష్ట్రం వచ్చిన ఈ శుభసమయంలో వారు మనమధ్య లేకపోయినందుకు అశ్రుతర్పణ గావించారు. అధ్యక్షుల వారు మాట్లాడుతూ, భాషావిషయంలో వచ్చిన మార్పులు అంతే కట్టుపాటు లేని వ్రాతలను నిరసించుచూ అయినప్పటికి అప్పారాయకవి అంగ్రములు చిరస్మరణీయము లన్నారు.

శ్రీ కె. వి. పున్నారావుగారి వందన సమర్పణతో కార్యక్రమము ముగిసింది.

### అమలాపురం

శ్రీ కోనసీమ భానోజీరామర్స్ కళాశాలలో నవంబరు 26 వ తేదీన జరిగిన సమావేశంలో సంస్కృతిభాషా ప్రాధాన్యత గురించి శ్రీ యన్. టి. జి. వరదాచార్యులుగారు ప్రసంగించారు. వారణాసి రామబ్రహ్మంగారు అధ్యక్షత వహించారు. సంస్కృతభాషను ఉన్నత పాఠశాలల్లో నిర్బంధభాషగా చేయాలనీ కనీసం రెండు గంటలైన దీనికి ప్రత్యేకించాలనీ కోరుతూ తీర్మానించారు.

### సత్తెనపల్లి

గాంధి చౌపన్నగరు 28 తే సాయంకాలం శ్రీ వావిలాలగోపాలకృష్ణయ్యగారధ్యక్షత బహిరంగ సభ జరిగినది. శ్రీమతి గుడిపూడి ఇందుమతి దేవి గారు గాంధీజీ జీవిత చరిత్రను గురించి వుపన్యసించారు. శ్రీ బూరుగుపూడి సత్యనారాయణగారి వందన సమర్పణముతో సభ ముగిసినది.

### చీరాల

భగవద్గీతా పఠన పరీక్షలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు బహుమతు లిచ్చుటకు, స్థానిక పురపాలకోన్నత పాఠశాలలో యీనెల 3 న సాహితీ సమితివారి ఆధ్వర్యమున మునిసిపలు కమీషనరు శ్రీ పి. నాగభూషణం నాయుడుగారి అధ్యక్షతన ఒకబహిరంగసభ జరిగెను. భగవద్గీతా పఠనము ప్రాముఖ్యతగూర్చి అధ్యక్షులవారు, కాలేజి(ప్రిన్సి పాలు డాక్టరు వేమూరి రామారావుగారు, తెలుగు పండితులు గూడ సత్యనారాయణశాస్త్రిగారు తదితరులు వుపన్యాసములు గావించారు. డాక్టరు వేమూరి రామారావుగారు గెలుపొందిన విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టిరి. ఉపాధ్యాయులు వెంపరాల అక్కిరాజు, అమరా వెంకటసుబ్బయ్య గార్లు రజతపాత్రలు బహూకరించినందులకు సమితి తరఫున కార్యదర్శి కర్లపాలెం కుటుంబశాస్త్రిగారు ధన్యవాదము లర్పించిరి. తెలుగు పండితులు కె. తిరువెంగళాచార్యులుగారి వందన సమర్పణముతో సభ ముగిసెను.

### వేగేశ్వరపురం

కె. ఎస్. ఆర్. బోర్డుహైస్కూలు ప్రాతవిద్యార్థి సంఘ కార్యవర్గం ఈ 4-వ తేదీన సమావేశమై హైస్కూలు ప్రాతవిద్యార్థి సంఘపు తొలి వార్షికోత్సవము ఏప్రియల్ నెలలో జరుపుటకు నిశ్చయించినారు.

### పుల్లలచెరువు

కంభంతాలూకా కమ్యూనిస్టు పార్టీ మహాసభ గతనెల 28 నుంచి 30 వరకు యిచట శ్రీ ఓ. వెంకటరంగయ్యగారి అధ్యక్షతన జరిగినది. సిద్ధేశ్వరం, గండికోట, నందికొండ ప్రాజెక్టులను పంచవర్ష ప్రణాళికలో చేర్చి పని ప్రారంభించాలనీ కంభం తాలూకాలో నీటివసతి లేదు, ఎనుముమేత మున్నగు ప్రాజెక్టులను నిర్మించాలనీ అప్పుల వసూళ్ళు వాయిదా వేసి, నూతనంగా బావుల సబ్సిడీలు యివ్వాలనీ బంజరు భూముల సాగు చేస్తున్న వారికి పట్టాలివ్వాలనీ కోరుతూ తీర్మానాలు చేశారు.

### విజయనగరం

మహారాజా కళాశాల వుపాధ్యాయులు, విద్యార్థులు, డిసెంబరు 1 న సమావేశమై శ్రీ బి. యన్. రావు మృతికి తమ సంతాపం ప్రకటిస్తూ వారికుటుంబానికి తమ సానుభూతిని తెలియజేయుటకు తీర్మానించారు.

### విజయవాడ

పట్టణ కాంగ్రెసు అధ్వర్యాన శ్రీ బాపయ్యగారు రామానగరం చౌకువద్ద జాతీయ జెండా ప్రతిష్ఠించారు. జైహిండ్ సేవాసమితి కార్యాలయం వద్ద మురుపిళ్ళ చిట్టిగారు జెండా ప్రతిష్ఠ జరిపారు. దిట్టకవి వీరరాఘవయ్యగారు కార్యాలయానికి ప్రారంభోత్సవం చేశారు. అనంతరం పేటబాపయ్యగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగినది.

మురుపిళ్ళ చిట్టిగారి 55 వ జన్మదినోత్సవం నవంబరు 29 న జరుపబడినది. త్రిపురాంబ పురజన సంఘంవారు వారి గౌరవార్థం తేనీటివిందు చేశారు.

### కనగాల

చేనేత కాంగ్రెసు సత్యాగ్రహుల సన్మానసభ కవులతరప్ప శ్రీరాములుగారి అధ్యక్షతన నవంబరు 30 న జరిగినది. జొన్నాదుల చలపతిరావు, రాచాబత్తుని గురుమూర్తి ప్రభృతులు ప్రసంగించారు.

### గుడివాడ

కళాశాల విద్యార్థులు గోపరాజు సాంబశివరావుగారి అధ్యక్షతన నవంబరు 30 న సమావేశమై శ్రీ బి. యన్. రావుగారి మృతికి సంతాపం ప్రకటించారు.

ప్రాథమికోపాధ్యాయ నాట్యమండలివారు నవంబరు 30 న పేదరైతు నాటకం ప్రదర్శించారు. శ్రీ జగన్నాథరావుగారు అధ్యక్షత వహించారు.

### నిడుబ్రోలు

పి. బి. యన్. కళాశాలలో హిందూదేశ చారిత్రిక కాంగ్రెసు ఈ నెల 1 న జరుపబడినది. రిపబ్లిక్ ఉపాధ్యక్షులుగ ప్రిన్సిపాలు శ్రీ వి. గోపాలం వ్యవహరించారు. టి. ఎ. డేవిడ్ గారు వుపన్యసించారు. విద్యార్థులు చరిత్ర పరిశోధకులుగా తమ రచనలు చదివారు. జరిపాల నరసింహారావు, హుస్సేన్, కుమ్మర కృష్ణమూర్తి, అంబటిపూడి పద్మనాభమూర్తి, యన్. యతిరాజులు, యమ్. రమాకాంత రావుగార్లు సుప్రసిద్ధ చారిత్రకులుగ వ్యవహరించారు, యం. సుందర రావుగారు వందనాలర్పించారు.

### తిరుచానూరువద్ద అగ్నిప్రమాదం
#### ఉత్సవ సందర్భంలో

తిరుపతి, డిసెంబరు 6: తిరుచానూరువద్ద పద్మావతి తాయారు వారి ఆలయంలో జరుగుచున్న వుత్సవ సందర్భంలో యేర్పాటు చేయబడిన ప్రత్యేక పందిరి అగ్నిప్రమాదానికి గత రాత్రి గురిఅయినది. ధ్వజస్తంభంపైన కట్టిన ధ్వజపటంకూడ దగ్ధమైనది.

ఇచట ఈనెల 8 న యీ వుత్సవం ప్రారంభమైనది. ప్రమాదం జరిగినప్పుడు విగ్రహం ఆలయంలో లేదు. ఊరేగింపులో వున్నది.

ఈ వార్త చేరగానే ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు అన్నారావు, అగ్నిమాపక దళ వుద్యోగి యం. కృష్ణమూర్తిగార్లు వెళ్లి తక్షణమే మంటలు ఆర్పివేశారు. చెత్తచెదారం వెంటనే తీసి వేయబడినవి, ధ్వజారోహణ కార్యక్రమం తిరిగి జరుపబడినది.

ఈ ప్రమాదానికి కారణం విద్యుచ్ఛక్తికి సంబంధించినదై యుంటుందని తెలుస్తున్నది. స్వ. వి.

### యలమంచిలి గ్రామంలో అగ్నిప్రమాదం

యలమంచిలి, డిసెంబరు 5, యలమంచిలి గ్రామంలో మాస్టర్ మన్ పేటకు చెందిన హరిజనవాడలో 2 వ తేదీ మధ్యాహ్నము ప్రమాదవశమున నిప్పు అంటుకొని 55 యిండ్లు పైగా అగ్నికి ఆహుతి అయినవి. పదరు హరిజనులు కూలీలు అగుటను, యిండ్లవద్దలేని కారణమున వారి సామాను తీసికొనుటకు వీలులేకపోయినది. సుమారు 25 వేల రూ॥లు నష్టము అంచనా వేస్తున్నారు. ఆ రాత్రి పంచాయితీబోర్డు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ రాముడురెడ్డి, సత్యనారాయణగారు, రంగా వెంకటరణగార్ల కృషివలన గ్రామములో బియ్యము వసూలు చేసి అగ్నిబాధితులకు అన్నదానము గావింపబడెను.

### తూర్పుగోదావరి సైనిక నావిక వైమానికసంఘం

కాకినాడ, డిశంబరు 3: తూర్పుగోదావరిజిల్లా సైనిక నావిక, వైమానికసంఘ సమావేశం నవంబరు 28 తేదీన, బోర్డు ప్రెసిడెంటును జిల్లాకలెక్టరు హెచ్. సాంబమూర్తిగారి అధ్యక్షతన అమలాపురంలో జరిగినది. సమావేశానికి నాకా కమాండర్ గేడీ (విశాఖపట్నం) యు. డి. గోపాలరావు (సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు) కాకినాడ ఆర్. డి. ఒ. బి. సుందరాచారి, అమలాపురంర్ ఆ. డి. ఒ. వేములు, ఏరియా రిక్రూటింగ్ ఆఫీసరు (విశాఖపట్నం) సెంట్రల్ డివిజన్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు జిల్లా ఎంప్లాయిమెంటు ఆఫీసరు ఎన్. ఎస్. రామానుజంగారలు సమావేశానికి హాజరైనారు.

కార్యదర్శి ఎన్. ఎస్. రామానుజంగారు, గత ఆరునెలలుగా జరిగిన పని సమీక్షిస్తూ నివేదిక చదివి వినిపించారు.

మాజీసైనికుల వార్షిక సమావేశాన్ని 54 ఫిబ్రవరిలో జరుపుటకు నిశ్చయించబడింది. రాజమండ్రి సభ కలెక్టరు సి. డబ్ల్యు. డి ఇంజనీరు, కెప్టెన్ పేర్రాజు యం. వి. గోపాలరావు డిప్యూటీ రిజిస్ట్రారు, ఎల్. ఎన్. రామానుజం (కన్వీనరు) గారలతో ఒక ఉపసంఘాన్ని నియమించారు. మరికొందరు అవధి కోరులను సభ్యులుగా చేర్చుకొనే అధికారం యీ ఉపసంఘానికి యివ్వబడింది.

19 వ తేదీన నాకా దళోత్సవాన్ని జరుపుటకు తీసుకోవలసిన చర్యలను గురించి గూడా చర్చించారు.

బోర్డు కోరికపై, సహకార సంఘం రిజిస్ట్రారు ఆమోదమునకు లోబడి, 60 వేల రూ.ల పెట్టుబడితో కాకినాడలో, మాజీసైనికుల ఆటోరిక్షా సహకార సంఘాన్ని స్థాపించుటకు డిప్యూటీ రిజిస్ట్రారుగారు ఒకప్లాను తయారుచేశారు. ఈపెట్టుబడి డబ్బులో సగం సహాయంగాను, మరోసగం యుద్ధానంతరం సైనిక సహాయ నిధి నుండి అప్పుగాను కోరబడుతుంది.

ఆటోరిక్షా సంఘం ఆరంభంలో 12 రిక్షాలతో 24 మాజీ సైనిక డ్రైవర్లతో యేర్పాటు చేయుటకు నిశ్చయించారు.

### అనకాపల్లిలో శ్రీ వి. వి. రమణ గారికి సన్మానం

అనకాపల్లి, డిసెంబరు 4: ఆంధ్ర కృషికార్ లోక్ పార్టీ, కార్యదర్శి శ్రీ వి. వి. రమణగారు స్టేటు కౌన్సిలు సభ్యులుగా ఎన్నికైన అనంతరం క్రితం ఆదివారంనాడు యిక్కడికి వచ్చిన సందర్భమున చాలామంది నేతలలో వారికి ఘన స్వాగతమిచ్చి వాద్యములతో పుర వీధులగుండా ఊరేగింపు చేశారు.

సాయంత్రము రాష్ట్ర లోక్ పార్టీ అధ్యక్షతను బి బ్బ పీ థ కొబ్బరితోట మైదానములో సారసభ జరిగినది. సభలో సుమారు నాలుగు వేలమంది స్త్రీ పురుషులు పాల్గొన్నారు. సభలో అనకాపల్లిలోనున్న వివిధ సంఘముల వారు పుష్పమాలలు, ఫలములు, సన్మాన పత్రములు సమర్పించి శ్రీ రమణగారిని గౌరవించారు. అధ్యక్షులు శ్రీ అప్పారావుగారు మాట్లాడుతూ శ్రీ రమణగారి విజయాన్ని అనకాపల్లి పట్టణ, తాలూకా ప్రజలు ముఖ్యంగా గ్రామీక ప్రజల విజయముగా నియు, యీ చిన్న వయస్సులో శ్రీ రమణగారు స్టేటు

### 'రాజధాని సమస్యను తిరిగి రానివ్వరాదు'
#### గవర్నరుకు కర్నూలు కార్యాచరణ సంఘ విజ్ఞప్తి

కర్నూలు, డిసెంబరు 6: రాష్ట్ర శాసనసభా సమావేశంలో తిరిగి రాజధాని ప్రసక్తి రానివ్వరాదని కోరుతూ గవర్నరు శ్రీ త్రివేదీగారికి ఆంధ్ర రాజధాని కార్యాచరణ సంఘం తరఫున వచ్చిన రాయబారవర్గంవారు ఒక వినతిపత్రం సమర్పించారు.

విజయవాడ-గుంటూరు, లేదా విశాఖపట్నంలలో శాశ్వతరాజధాని గావాలన్న ప్రతిపాదనను శాసనసభ తిరస్కరించిందనీ, కనుక యీ సమస్య యికరానివ్వరాదనీ, విశాలాంధ్ర యేర్పడు వరకు కర్నూలునే రాజధానిగ వుంచాలనీ కూడ కోరారు.

ఈరాయబారవర్గంలో శ్రీయుతులు పెండేకంటి వెంకటసుబ్బయ్య, నివర్తి వెంకటసుబ్బయ్య (జిల్లా కాంగ్రెసు అధ్యక్ష కార్యదర్శులు) కె. యం. చినతిమ్మయ్య (పట్టణ కాంగ్రెసు అధ్యక్షులు) ఎస్. శంకరయ్య (ఆంధ్ర రాష్ట్ర వెనుకబడిన తరగతుల సమితి అధ్యక్షులు)గారు సభ్యులుగా వున్నారు.

రాజధాని కార్యాచరణ సంఘం వారు యిటువంటి విజ్ఞప్తినే కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ నెహ్రూకు పంపారు. త్వరలో రాయబారవర్గం వారు ఢిల్లీకివెళ్లి స్వయంగా యీ విషయం చెప్పాలని వుద్దేశిస్తున్నట్లు తెలుస్తున్నది.

కౌన్సిలుకు ఎన్నికైనందుకు వారిని ఎన్నుకొన్న ఆంధ్ర శాసనసభ్యులకు, వారి విజయమునకు కృషిచేసిన పార్టీ నాయకులకు అనకాపల్లి పౌరుల తరఫున ధన్యవాదాలర్పించారు.

### పంచాయితీ సీనియరు ఉద్యోగుల సంఘం

నిడదవోలు, డిశంబరు 3: ఆంధ్ర రాష్ట్ర పంచాయితీ సీనియరు వుద్యోగుల సమావేశము, రాజం పంచాయితీ బోర్డు గుమాస్తా శ్రీ సీతారామమూర్తిగారి అధ్యక్షతను జరిగినది. ఆంధ్ర దేశములోని పలుప్రాంతముల నుండి ప్రతినిధులు సుమారు 50 మంది వచ్చారు.

సమావేశములో యీ సంఘమునకు కావలసిన నిబంధనావళిని తయారు చేయవలసినదిగా కార్యవర్గమును కోరుచూ తీర్మానించారు. ఈ సంఘమును గుర్తించవలసినదిగా ఆంధ్ర ప్రభుత్వమును కోరుటకు నిర్ణయించారు. సంఘములో సభ్యులుగా చేరుటకు, మేజరు పంచాయితీ వుద్యోగస్థులకు రు. 4/-లున్ను, మైనరు పంచాయితీల వుద్యోగస్థులకు రు. 2/-లున్ను సంవత్సరం చందా యేర్పరచారు. 30 మంది సభ్యులను కార్యవర్గముగా ఎన్నుకొన్నారు.

కార్యవర్గము ప్రత్యేకముగా సమావేశమై, నిడదవోలు పంచాయితీబోర్డు ప్రథమ గుమాస్తా శ్రీ అయ్యగారి వాసుదేవమూర్తిగారిని అధ్యక్షులుగాను, కడపజిల్లా కోడూరు పంచాయితీ గుమాస్తా శ్రీ యస్. వి. సుబ్బయ్యగారిని, కృష్ణాజిల్లా అట్లూరు పంచాయితీ గుమాస్తా శ్రీ కృష్ణారావుగారిని కార్యదర్శులుగాను ఎన్నుకొన్నారు. సభ్యులకు వీలుగానుండుటట్లు సంఘమును తూర్పు, పశ్చిమ జోనులుగా విడదీశారు.

### పన్నుల వసూళ్లు వాయిదా వేయాలి
#### రెవిన్యూమంత్రి వద్దకు రాయబారం

కర్నూలు, డిసెంబరు 6: శ్రీయుతులు పై. ఆదినారాయణరెడ్డి (శాసనసభ్యులు) యం. దిబ్బారెడ్డి గార్లు రెవిన్యూమంత్రి శ్రీ కోటిరెడ్డి గారిని చేరు కలసికొని జనవరి ఆఖరుకు కిస్తీల వసూళ్లు వాయిదా వేయాలని కోరారు. జనవరినుంచి వసూళ్లు నెమ్మదిగా ప్రారంభించాలనీ, వత్తిడి చేయరాదనీ రెవిన్యూ వుద్యోగులకు ఆనతియివ్వగలనని మంత్రిగారు వారికి హామి యిచ్చినట్లు తెలుస్తున్నది. బుక్కపట్నం, ఎర్రగుడి మైనరు యిరిగేషను పనులు ప్రారంభించాలనీ కంచాలమ్మ చెరువు మరమ్మతుకు అవసరమైన మొత్తాన్ని వచ్చే బడ్జెటులో కేటాయించాలనీ కూడా రాయబారవర్గం కోరారు. (ప. టి. ఐ)

### డిప్యూటీ స్పీకరుకు పౌర సమ్మానం జరుప నిర్ణయం

భీమవరం, డిసెంబరు 6: నిన్న ఏర్పాటైన పురపాలక సంఘ అత్యవసర సమావేశంలో శాసనసభ డిప్యూటీ స్పీకరు శ్రీ పసల సూర్యచంద్రరావు గారికి పౌర సమ్మానం జరపాలని తీర్మానించారు. సమావేశానికి శ్రీనాచు వెంకట్రామయ్య అధ్యక్షత వహించారు.

గునుపూడి రైల్వేస్టేషను సమీపాన గూడ్సుషెడ్ రోడ్డు పక్కన అగ్ని మాపక యంత్రాలను నెలకొల్పాలనీ ఒక దున్నపోతును సప్లయి చేయించి వెటర్నరీ శాఖవారి అధీనంలో వుంచాలనీ, ప్రస్తుత సూపరువైజరు గారిని బదిలీ చేయుటకు చర్యలు గైకొనాలనీ ప్రభుత్వాన్ని కోరుతూ అంతకు మునుపు జరిగిన సాధారణ సమావేశంలో తీర్మానాలు చేశారు.

పిదప జిల్లా ఆరోగ్య శాఖాధికారి నివేదిక చర్చించి ఒక వెటర్నరీ అసిస్టెంటును నియమించుటకు, పాకీ పనివారల సంఖ్య హెచ్చించుటకు కౌన్సిలు వారు నిర్ణయించారు.

శ్రీ వెంద్ర అప్పారావుగారి ప్రశ్నలకు వి. సుబ్బరాజు, కమిషనరు గార్లు సమాధానమిస్తూ శానిటరీ యిన్ స్పెక్టరు సక్రమంగానే ప్రవర్తిస్తున్నారనీ యేమైనా ఫిర్యాదులు వస్తే విచారించగలమనీ చెప్పారు. (స్వ వి.)



### వేలము ప్రకటన

ఏకాంబరకుప్పం పాన్ బ్రోకరు ఎస్. ఎం. ఏ. సోమసుందర మొదలియార్ వద్ద 1952 సంవత్సరము జనవరి ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు & డిసెంబరు నెలలలో ఏలం కేట్లోసులో కనిన ప్రకారము కుదువపెట్టియుండు నగలను 1953 సంవత్సరము డిసంబరు నెల 30-వ తేది బుధవారము పగలు 10 గంటలకు ఏకాంబరకుప్పం పెద్దవీధి 1/99, నెంబరు ఇంటిలో బహిరంగముగా యేలము వేయబడును.
ఏ. జి. పొన్నప్ప మొదలియార్, అప్రూవ్డ్ ఆక్షనర్, ఏకాంబరకుప్పం.

